పూర్తి ఉచితము






# వరసిద్ది వినాయక వ్రత పూజ విధానము

సనాతన హిందూ సాంప్రదాయాలు ఛానల్

# పూజకు కావాల్సినవి

**శ్రీ వరసిద్ధి వినాయక పూజకు కావలసిన వస్తువులు,పూజా విధానము.**

**పసుపు 25 గ్రా.**

**కుంకుమ 25 గ్రా.**

**పసుపు గణపతి (మట్టితో చేసిన గణపతి పూజకు శ్రేష్టం)**

**బియ్యం**

**తమలపాకులు 20**

**అగరవత్తులు 1 పేకట్**

**ప్రత్తి (ఒత్తులకు, వస్త్రయుగ్మమునకు,యజ్ఞోపవీతమునకు)**

**దీపము ( కొబ్బర నూనెతో శ్రేష్టం,ఆవునేతితోగాని)**

**పంచామృతములు (ఆవుపాలు, పెరుగు, నెయ్యి, తేనె, పంచదార నీళ్ళు లేదా కొబ్బరి నీళ్ళు)**

**గంధము**

**వక్కలు**

**అరపలు**

**బెల్లం 100 గ్రా**

**కొబ్బరికాయ**

**హారతి కర్పూరం**

**వినాయక ప్రతిమ మట్టిదే వాడవలెనా? రంగుది వాడవలనా ? అనే సందేహానికి గణేశ పురాణంలో సమాధానం కలదు.**

**శ్లో :- పార్థివి పూజితమామూర్తి స్థైవావా పురుషాన్వా ఏకదడతి సా కామ్యం ధన పుత్రం పశునపీ!!**

**పురుషుడు గాని, స్త్రీ గాని మట్టితో చేసిన గణపతి ప్రతిమను పూజించినచో ధన, పుత్ర, పశ్వాది అన్నీ సంపదలను పొందవచ్చు.**

## ఆ ప్రతిమ ఏ మట్టితో చేయవలెను?

**" మృత్తికాంశం సుందరమ్ స్నిగ్ధాం సంచలనం పాషాణ వర్జితాం "**

**శుభ్రం చేసిది. మెత్తనిది, రాళ్ళు, ఇతర మాలిన్యములు లేనిది అగు మట్టిని స్వచ్ఛమైన నీటితో తడిపి ప్రతిమచేయవలెను. నాలుగు చేతులు గల వినాయక ప్రతిమను సవ్యముగా చేసుకొనవలెను. అయితే ఇది అందరికి సాధ్యమని కానిది.**

**ప్రతి పట్టణములోను అప్పటికప్పుడు మట్టిని అచ్చులో వేసి ప్రతిమను చేసిన అచ్చులు వినాయకచవితి ముందురోజు నుండే పెడుతున్నారు. ప్రతిమ అన్నిటికన్నా మంచిదని గణేశ పురాణము బట్టి గ్రహించవలెను.**

**వినాయక చవితి రోజున ప్రాతఃకాలమే లేచి ఇంటిని శుభ్రం చేయాలి. తర్వాత తలంటు స్నానం చేసి ఉతికి వస్త్రాలను ధరించాలి. మామిడాకులు తోరణాలు కట్టి, ఇంటిని అలంకరించాలి .**

ఓ పీటకు పసుపు రాసి ఇంటికి ఈశాన్య భాగంలో లేదా ఉత్తర దిక్కులో ఉంచాలి. ఓ పళ్లెంలో బియ్యంవేసి వాటిపై తమలపాకులు పెట్టుకోవాలి. అగరువత్తులు వెలిగించి, దీపారాధన తర్వాత ఈ కింది మంత్రాన్ని ఉచ్ఛరిస్తూ పూజను ప్రారంభించాలి.

ఓం దేవీంవాచ మజనయంత దేవాస్తాం విశ్వరూపా: పశవో వదంతి

సానో మంద్రేష మూర్జం దుహానాధే నుర్వాగాస్మానుప సుష్టుతైత్తు అయం ముహూర్తస్సుముహూర్తోస్తు

శ్లోకం: **యశ్శివో నామరూపాభ్యాం యా దేవీ సర్వ మంగళా తయో స్సంస్మరణా త్సుంసాం సర్వతో జయమంగళం** అని చదవాలి.

పీటపై వినాయక ప్రతిమను ఉంచి, పాలవెల్లికి పసుపు రాసి, కుంకుమతో బొట్టు పెట్టి విగ్రహం తలపై వచ్చేలా దాన్ని వేలాడదీయాలి. దీనిపై పత్రి వేసి నలువైపులా మొక్కజొన్న పొత్తులు, పళ్లతో అలంకరించాలి. ఉండ్రాళ్లు, కుడుములు, పాయసం, గారెలు, పులిహోర, మోదకులు, జిల్లేడుకాయలు మొదలైన పిండివంటలు సిద్ధం చేసుకోవాలి. రాగి లేదా ఇత్తడి పాత్రను తీసుకుని పసుపు రాసి, అందులో నీళ్లువేసి, పైన టెంకాయ, జాకెట్టు ఉంచి కలశం ఏర్పాటు చేయాలి.

## గణపతి ప్రార్థన

### పసుపు గణపతిని పూజించాలి

వినాయక చవితి రోజున చేయుటకు వినాయక వ్రతము ప్రముఖ శుభకార్యం కాబట్టి ముందు పసుపుతో చేసిన గణపతి పూజించవలెను. పసుపుతో చేసిన గణపతికి కుంకుమ పెట్టి తమలపాకులో ఉంచవలెను. చిన్నపల్లెములో బియ్యం పోసి ఆ బియ్యం మీద పసుపుతో చేసిన గణపతి తమలపాకుతో పాటు ఉంచవలెను.స్వామి వారు తూర్పు దిశ చూస్తున్నట్లు ఉండవలెను. కొబ్బరి నూనే లేదా ఆవునేతితో దీపము వెలిగించి, గణపతికి నమస్కరించి ఈ విధముగా చదువ వలెను.

శ్రీ మహాగణాధిపతియే నమః : శ్రీ గురుభ్యోనమః : హరి : ఓం

శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజం

ప్రసన్న వదనం ధ్యాయేత్ సర్వ విఘ్నోపశాంతయే!!

అగజానన పద్మార్కం గజాననమహర్నిశం

అనేక దం తం భక్తానాం ఏకదంతముపాస్మహే!!

శ్రీ వక్రతుండ మహాకాయ కోటిసూర్య సమప్రభ

నిర్విఘ్నం కురు మే దేవ సర్వ (శుభ) కార్యేషు సర్వదా!!

**ఆచమనం:-**

**ఓం కేశవాయ స్వాహా**

**ఓం నారాయణాయ స్వాహా**

**ఓం మాధవాయ స్వాహా**

**(అని మూడుసార్లు ఆచమనం చేయాలి)**

**ఓం గోవిందాయ నమః (నీళ్ళు వదిలి వెయవలెను)**

**విష్ణవే నమః , మధుసూదనాయ నమః , త్రివిక్రమాయ నమః , వామనాయ నమః , శ్రీధరాయ నమః, ఋషీకేశాయ నమః , పద్మనాభాయ నమః , దామోదరాయ నమః , సంకర్షణాయ నమః , వాసుదేవాయ నమః , ప్రద్యుమ్నాయ నమః , అనిరుద్ధాయ నమః , పురుషోత్తమాయ నమః , అధోక్షజాయ నమః , నారసింహాయ నమః , అచ్యుతాయ నమః , జనార్ధనాయ నమః , ఉపేంద్రాయ నమః , హరయే నమః , శ్రీ కృష్ణాయ నమః.**

**(ప్రాణాయామం చేసి అక్షతలు వెనుకకు వేసుకొనవలెను.)**

**ఉత్తిష్ఠంతు భూతపిశాచా ఏతే భూమిభారకాః**

**ఏతేషా మవిరోధేనా బ్రహ్మాకర్మ సమారభే ||**

**(కుడిచేతితో ముక్కుపట్టుకొని యీ మంత్రమును ముమ్మారు చెప్పవలెను)**

**ఓం భూః ఓం భువః ఓం సువః ఓం మహః ఓం జనః ఓం తపః ఓం సత్యం ఓం తత్సవితుర్వరేణ్యం భర్గో దేవస్య ధీమహి ధియో యోనః ప్రచోదయాత్ ఓం అపోజ్యోతి రసోమృతం బ్రహ్మా భూర్భువస్సువరోమ్!!**

ఓం లక్ష్మినారాయణభ్యయం నమః

శ్రీ ఉమామహేశ్వరాభ్యం నమః

శ్రీ వాణిహిరణ్యగర్భాభ్యం నమః

శ్రీ శచిపురంధరాభ్యం నమః

శ్రీ అరుంధతివసిష్టాభ్యం నమః

శ్రీ  సీతారామాభ్యం నమః

సర్వేభ్యో దేవేభ్యో నమః   మాతృభ్యో నమః,  పితృభ్యో నమః

## సంకల్పం

మమ ఉపాత్త సమస్త దురితక్షయ ద్వారా శ్రీ పరమేశ్వర ప్రీత్యర్థం శుభేశోభనే ముహూర్తే, శ్రీ మహావిష్ణోరాజ్ఞాయా ప్రవర్తమానస్య అద్య బ్రాహ్మణః ద్వితీయపరార్ధే, శ్వేతవరాహకల్పే, వైవస్వత మన్వంతరే, కలియుగే, ప్రథమపాదే, జంబూ ద్వీపే, భరతవర్షే, భరతఖండే, మేరోర్ధక్షిణదిగ్భాగే, _ _ _ _ _.. నదీ సమీపే_ _ _ _ _ _ _ _ ( శ్రీ శైలస్య) నివాసిత గృహే అస్మిన్ వర్తమాన వ్యావహారిక, చాంద్రమానేన శ్రీ_ _ _ _ _ _ _ _ _ _ _ _ _.నామ సంవత్సరే, _ _ _ _ _ _ _ _ _ _ _ _ _ (దక్షిణాయనే), _ _ _ _ _.. (వర్ష) ఋతౌ, _ _ _ _ _ _ _ _ (భాద్రపద) మాసే, _ _ _ _ _ _ _ _ (శుక్ల) పక్షే,... _ _.. (చతుర్థ్యాం) తిథి _ _ _ _ _ _ _ _ _ _ _ _ _ _ _ _. వాసరే, శుభ నక్షత్రే, శుభయోగే శుభకరణే, ఏవంగుణ విశేషేణ విశిష్టాయాం, శుభతిథౌ శ్రీమాన్_ _ _ _ _ _ _ _ _ _ గోత్రః _ _ _ _ _ _ _ _.నామధేయః ధర్మపత్నీ_ _ _ _ _ _ _ _ _ _ _ _ _ _ _ సమేతోహం సకుటుంబస్య క్షేమస్థైర్య విజయ అభయ ఆయురారోగ్య ఐశ్వర్యాభి వృధ్ద్యర్థం, ధర్మార్థ కామ మోక్ష చతుర్విధ ఫల పురుషార్ధ సిద్ధ్యర్థం, పుత్రపౌత్రాభివృద్ధ్యర్థం సకలకార్యేషు సర్వదా దిగ్విజయసిద్ధ్యర్థం, శ్రీ వరసిద్ధి వినాయక దేవతా

ముద్దిస్య శ్రీ వరసిద్ధి వినాయక దేవతాపూజాం కరిష్యే అదౌ నిర్విఘ్న పరిసమాప్త్యర్ధం శ్రీ మహాగణాధిపతి పూజాం కరిష్యే అంటూ కుడిచేయి ఉంగరం వేలితో నీళ్లు ముట్టుకోవాలి.

శ్లో : కలశస్య ముఖే విష్ణు : కంఠే రుద్రస్సమాశ్రిత

మూలే తత్రస్థితో బహ్మా మధ్యే మాతృగణా స్స్మృతా:

కుక్షౌతు సాగరా స్సర్వే సప్తద్వీపా వసుంధరా |

ఋగ్వేదోథయర్వేద స్సామవేదో హ్యథర్వణ

అంగైశ్చ సహిత స్సర్వే కలశాంబు సమాశ్రితా|

ఓం ఆకలశేషు ధావతి పవిత్రే పరషిచ్యతే ఉక్థైర్యజ్ఞేషు వర్ధతే , ఆపోవా ఇదగ్ం సర్వం|

విశ్వభూత న్యాప: ప్రాణావా ఆప: పశవ ఆపోఽన్నమాపోఽ మృత మామస్సమ్రాడాపో

విరాడాప స్వరాడా పశ్చందాగ్ శ్యాపో జ్యోతిగ్ ష్యాపో యజూగ్ ష్యాప స్సత్యమాప స్సర్వా దేవత ఆపో భూర్భువస్సువరాప ఓం .

గంగేచయమునేచైవ గోదావరి సరస్వతీ|

నర్మదే సింధుకావేరి జలేస్మిన్ సన్నిధింకురు||

ఆయాంతు శ్రీ మహాగణపతి పూజార్ధం మమ దురతక్షయ కారకా| కలశోదకేన దేవత, ఆత్మానం, పూజా ద్రవ్యాణి సంప్రోక్ష్య.

**(కలశములోని నీరు పుష్పముతో గణపతి పైన, పూజద్రవ్యముల పైన చల్లవలెను.)**

## గణపతి పూజ

### ప్రాణ ప్రతిష్ట

పుష్పముతో పసుపు గణపతి తాకుతూ ఈ క్రింది విధముగా చదువ వలెను.

అసునీ తేపునరస్మాసు చక్షు : పునః : ప్రాణ మినహనో దేహి భోగమ్|

జ్యోక్పశ్యేమ సూర్య ముచ్చరంత మనుమంతే మృడయాన స్వస్తి

ఓం అమృతం వై ప్రాణా: అమృతమాప: ప్రాణానేవ యధాస్థానముపహ్వాయతే||

స్థిరోభవ,వరదోభవ,సుముఖోభవ,సుప్రసన్నోభవ,స్థిరాసనం కురు|| .

ఓం గణానాంత్వా గణపతిగ్ంహావామహే కవిం కవీనాం ముమమశ్రవస్తవం|

జ్యేష్టరాజం బ్రహ్మాణాం బ్రహ్మణస్పత అనశృణ్వన్నూతిభిస్సీద సాదనమ్!

## షోడశోపచార పూజ

(క్రింది విధంగా చెబుతూ ఒక్కొక్కటికి గణపతికి అక్షితలను సమర్పించవలెను.)

శ్రీ మహాగణాధిపతియే నమః: ధ్యాయామి ధ్యానం సమర్పయామి, ఆవాహయామి ఆవాహనం సమర్పయామి. నవరత్న ఖచిత స్వర్ణ సింహసనం సమర్పయామి.

(అగరోత్తులు వెలిగించి దూపము చూపించాలి)

శ్రీ మహాగణాధిపతయే నమ: ధూపమాఘ్రాపయామి.

(దీపానికి నమస్కరించవలెను.)

దీపం దర్శయామి. ధూపదీపనంతరం శుద్ధాచమనీయం సమర్పామి. నైవేద్యం సమర్పామి.

నైవేద్యం:-

బెల్లము వండిన ప్రసాదం మీద నీరు చల్లి చుట్టూ నీరు వేసి క్రింది విధముగా చదివి నివేదనము చేయవలెను.

ఓం భూర్భువస్సువ:ఓం తత్సవితుర్వేణ్యం భర్గోదేవస్య ధీమహి ధియోయోన: ప్రచోదయాత్.

నీళ్ళు పుష్పంతో చల్లి

ఓం సత్యం త్వర్తేన పరిషించామి.

పుష్పము నీటిలో ముంచి నైవేద్య పదార్ధమ్ చుట్టు తిప్పాలి.

ఓం అమృతమస్తు | ఓమ్ అమృతోపస్తణమసి

ఓం ప్రాణాయ స్వాహా, ఓం అపానాయ స్వాహా,

ఓం వ్యానాయ స్వాహా, ఓం ఉదానాయ స్వాహా, ఓం సమానాయ స్వాహా ఓం బ్రహ్మేణ్యే స్వాహో గూడ సహితఫల నివేదనం సమర్పయామి (క్రిందివిధంగా చదివి నీటి వదలవలెను.)

మధ్య మధ్య పానీయం సమర్పయామి.

శ్రీ మహాగణాధిపతియే నమః: తాంబులం సమర్పయామి.

(కర్పూరం వెలిగించి గంట మ్రోగించాలి)

శ్రీ మహాగణాధిపతియే నమః: ఆనందకర్పూర నీరాజనం సమర్పయామి

పూజ చేసిన అక్షితలను, పుష్పములు శిరస్సున ధరించవలెను.

శ్లో : యస్యస్మృతాచ నామూక్త్యా తప: క్రిమాదిషు|

న్యూనం సంపూర్ణతాం యాంతి సద్యో వందే గణాధిప |

మంత్రహీనం క్రియా హీనం భక్తిహీనం గణాధిప |

యత్పూజితం మయాదేవ పరిపూర్ణం తదస్తుతే.

అనయా ధ్యాన అవాహనాది షోడశోపచార పూజయా భగవన్ సర్వాత్మక: శ్రీ మహాగణాధిపతి: వరదోభవతు

అని ఉదకం అక్షితలను చేతిలో వేసుకుని గణపతి కాళ్ళ దగ్గర వదిలి వేయాలి.మనస్పూర్తిగా స్వామికి నమస్కారం చేసుకోవాలి.

ఉద్వాసన :

యజ్ఞేన యజ్ఞ మయజంత దేవా: తాని ధర్మాణి ప్రధమాన్యాసన్ తేహనాకం మహిమానస్యచం తే యత్ర పూర్వే సాధ్యాస్సతి దేవా: శ్రీ మహాగణపతిం యధాస్థానం ప్రవేశయామి శోభనార్థే పునరాగమనాయచ||

పసుపు గణపతిని తమలపాకుతో తీసి పూజా మందిరం ఈశాన్య భాగంలో ఉంచవలెను.

## పుష్పాణి పూజయామి: అథాంగ పూజ పుష్పాలతో పూజించాలి.

గణేశాయ నమః – పాదౌ పూజయామి

ఏకదంతాయ నమః – గుల్ఫౌ పూజయామి

శూర్పకర్ణాయ నమః – జానునీ పూజయామి

విఘ్నరాజాయ నమః – జంఘే పూజయామి

అఖువాహనాయ నమః – ఊరూ పూజయామి

హేరంబాయ నమః – కటిం పూజయామి

లంబోదరాయ నమః – ఉదరం పూజయామి

గణనాథాయ నమః – నాభిం పూజయామి

గణేశాయ నమః – హృదయం పూజయామి

స్థూలకంఠాయ నమః – కంఠం పూజయామి

గజవక్త్రాయ నమః – వక్త్రం పూజయామి

విఘ్నహంత్రే నమః – నేత్రం పూజయామి

శూర్పకర్ణాయ నమః – కర్ణౌ పూజయామి

ఫాలచంద్రాయ నమః – లలాటం పూజయామి

సర్వేశ్వరాయ నమః – శిరః పూజయామి

విఘ్నరాజాయ నమః – సర్వాణ్యంగాని పూజయామి

## 21 రకాల పత్రాలతో పూజించాలి

సుముఖాయనమః – మాచీపత్రం పూజయామి|

గణాధిపాయ నమః – బృహతీపత్రం పూజయామి|

ఉమాపుత్రాయ నమః – బిల్వపత్రం పూజయామి|

గజాననాయ నమః – దుర్వాయుగ్మం పూజయామి

హరసూనవేనమః – దత్తూరపత్రం పూజయామి|

లంబోదరాయనమః – బదరీపత్రం పూజయామి|

గుహాగ్రజాయనమః – అపామార్గపత్రం పూజయామి|

గజకర్ణాయనమః – తులసీపత్రం పూజయామి,

ఏకదంతాయ నమః – చూతపత్రం పూజయామి,

వికటాయ నమః – కరవీరపత్రం పూజయామి|

భిన్నదంతాయ నమః – విష్ణుక్రాంతపత్రం పూజయామి,

వటవేనమః – దాడిమీపత్రం పూజయామి,

సర్వేశ్వరాయనమః – దేవదారుపత్రం పూజయామి,

ఫాలచంద్రాయ నమః – మరువకపత్రం పూజయామి,

హేరంబాయనమః – సింధువారపత్రం పూజయామి

శూర్పకర్ణాయనమః – జాజీపత్రం పూజయామి,

సురాగ్రజాయనమః – గండకీపత్రం పూజయామి,

ఇభవక్త్రాయనమః – శమీపత్రం పూజయామి,

వినాయకాయ నమః – అశ్వత్థపత్రం పూజయామి,

సురసేవితాయ నమః – అర్జునపత్రం పూజయామి|

కపిలాయ నమః – అర్కపత్రం పూజయామి|

**శ్రీ గణేశ్వరాయనమః – ఏకవింశతి పత్రాణి పూజయామి.**

## శ్రీ వినాయక అష్టోత్తర శతనామావళి పూజా

**ఓం గజాననాయ నమః**

**ఓం గణాధ్యక్షాయ నమః**

**ఓం విఘ్నరాజాయ నమః**

**ఓం విఘ్నేశ్వరాయ నమః**

**ఓం ద్వైమాతురాయ నమః**

**ఓం ద్విముఖాయ నమః**

**ఓం ప్రముఖాయ నమః**

**ఓం సుముఖాయ నమః**

**ఓం కృతినే నమః**

**ఓం సుప్రదీప్తాయ నమః**

**ఓం సుఖనిధయే నమః**

**ఓం సురాధ్యక్షాయ నమః**

**ఓం సురారిఘ్నాయ నమః**

**ఓం మహాగణపతయే నమః**

**ఓం మాన్యాయ నమః**

ఓం మహాకాలాయ నమః

ఓం మహాబలాయ నమః

ఓం హేరంబాయ నమః

ఓం లంబజఠరాయ నమః

ఓం హ్రస్వ గ్రీవాయ నమః

ఓం ప్రథమాయ నమః

ఓం ప్రాజ్ఞాయ నమః

ఓం ప్రమోదాయ నమః

ఓం మోదకప్రియాయ నమః

ఓం విఘ్నకర్త్రే నమః

ఓం విఘ్నహంత్రే నమః

ఓం విశ్వనేత్రే నమః

ఓం విరాట్పతయే నమః

ఓం శ్రీపతయే నమః

ఓం వాక్పతయే నమః

ఓం శృంగారిణే నమః

ఓం ఆశ్రిత వత్సలాయ నమః

ఓం శివప్రియాయ నమః

ఓం శీఘ్రకారిణే నమః

ఓం శాశ్వతాయ నమః

ఓం బల్వాన్వితాయ నమః

ఓం బలోద్ధతాయ నమః

ఓం భక్తనిధయే నమః

ఓం భావగమ్యాయ నమః

ఓం భావాత్మజాయ నమః

ఓం అగ్రగామినే నమః

ఓం మంత్రకృతే నమః

ఓం చామీకర ప్రభాయ నమః

ఓం సర్వాయ నమః

ఓం సర్వోపాస్యాయ నమః

ఓం సర్వకర్త్రే నమః

ఓం సర్వనేత్రే నమః

ఓం సర్వసిద్ధిప్రదాయ నమః

ఓం సర్వసిద్ధయే నమః

**ఓం పంచహస్తాయ నమః**

**ఓం పార్వతీనందనాయ నమః**

**ఓం ప్రభవే నమః**

**ఓం కుమారగురవే నమః**

**ఓం కుంజరాసురభంజనాయ నమః**

**ఓం కాంతిమతే నమః**

**ఓం ధృతిమతే నమః**

**ఓం కామినే నమః**

**ఓం కపిత్థఫలప్రియాయ నమః**

**ఓం బ్రహ్మ చారిణే నమః**

**ఓం బ్రహ్మరూపిణే నమః**

**ఓం మహోదరాయ నమః**

**ఓం మదోత్కటాయ నమః**

**ఓం మహావీరాయ నమః**

**ఓం మంత్రిణే నమః**

**ఓం మంగళసుస్వరాయ నమః**

**ఓం ప్రమదాయ నమః**

ఓం జ్యాయసే నమః

ఓం యక్షకిన్నర సేవితాయ నమః

ఓం గంగాసుతాయ నమః

ఓం గణాధీశాయ నమః

ఓం గంభీరనినదాయ నమః

ఓం వటవే నమః

ఓం పరస్మే నమః

ఓం జ్యోతిషే నమః

ఓం ఆక్రాంతపదచిత్ప్రభవే నమః

ఓం అభీష్టవరదాయ నమః

ఓం మంగళప్రదాయ నమః

ఓం అవ్యక్త రూపాయ నమః

ఓం పురాణపురుషాయ నమః

ఓం పూష్ణే నమః

ఓం పుష్కరోత్షిప్త వారణాయ నమః

ఓం అగ్రగణ్యాయ నమః

ఓం అగ్రపూజ్యాయ నమః

ఓం అపాకృతపరాక్రమాయ నమః

ఓం సత్యధర్మిణే నమః

ఓం సఖ్యై నమః

ఓం సారాయ నమః

ఓం సరసాంబునిధయే నమః

ఓం మహేశాయ నమః

ఓం విశదాంగాయ నమః

ఓం మణికింకిణీమేఖలాయ నమః

ఓం సమస్తదేవతామూర్తయే నమః

ఓం సహిష్ణవే నమః

ఓం బ్రహ్మావిద్యాది దానభువే నమః

ఓం జిష్ణవే నమః

ఓం విష్ణుప్రియాయ నమః

ఓం భక్తజీవితాయ నమః

ఓం జీవతమన్మధాయ నమః

ఓం ఐశ్వర్యకారణాయ నమః

ఓం సతతోత్థితాయ నమః

ఓం విష్వగ్దృశే నమః

ఓం విశ్వరక్షావిధానకృతే నమః

ఓం కళ్యాణ గురవే నమః

ఓం ఉన్మత్తవేషాయ నమః

ఓం పరజయినే నమః

ఓం సమస్తజగదాధారాయ నమః

ఓం సర్వైశ్వర్యప్రదాయ నమః

ఓం శ్రీ వినాయకాయ నమః

ఇతి శ్రీ వినాయక అష్టోత్తర శతనామావళి సంపూర్ణం

శ్రీ సిద్ధి బుద్ధి సమేత వరసిద్ధి వినాయక స్వామినే నమః అష్టోత్తర శతనామ పూజాం సమర్పయామి.

ధూపమ్ :

(అగరువత్తులను వెలిగించి ఆ ధూపాన్ని గణపతికి కుడి చేతితో చూపించాలి. అంతేగాని అగరువత్తులను చుట్టూ తిప్పకూడదు)

దశాంగం గుగ్గులోపేతం సుగంధం సుమనోహరం||

ఉమా సుత నమస్తుభ్యం గృహాణవరదో భవ||

శ్రీ సిద్ధి బుద్ధి సమేత వరసిద్ధి వినాయక స్వామినే నమః

ధూపమాఘ్రాపయామి.

దీపమ్ : (కర్పూర దీపాన్ని గాని, నేతి దీపాన్ని గాని కుడిచేతితో భగవంతునికి చూపాలి) స్వాజ్యంత్రివర్తి సంయుక్తం వహ్నినాద్యోతితం మయా గృహాణ మంగళం దీపం ఈశపుత్ర నమోస్తుతే||

శ్రీ సిద్ధి బుద్ధి సమేత వరసిద్ధి వినాయక స్వామినే నమః దీపం దర్శయామి||

నైవేద్యమ్ : (గణపతికి నివేదించాల్సిన అన్ని ఫలాలను, పిండి వంటలను పళ్లెంలో ఒక ఆకువేసి ఆ ఆకులో పెట్టి ఉంచాలి. వాటిపై ఈ క్రింది మంత్రంతో నీళ్ళు చల్లాలి)

ఓమ్ భూర్భువస్సువః ఓం తత్సవితుర్వరేణ్యం

భర్గోదేవస్య ధీమహి ధియోయనః ప్రచోదయాత్ ||

(పుష్పంతో నీటిని పదార్థాల చుట్టూ తిప్పాలి)

ఓమ్ సత్యంత్వర్తేన పరిషించామి||

ఓమ్ ఋతంత్వా సత్యేన పరిషించామి||(రాత్రి అయితే)

సుగంధాన్ సుకృతాంశ్చైవ మోదకాన్ ఘృతపాచితాన్ నైవేద్యం గృహ్యతాం దేవచణముద్గైః ప్రకల్పితాన్ భక్ష్యం భోజ్యం చ లేహ్యంచ చోష్యం పానీయమేవచ ఇదం గృహాణ నైవేద్యం మయా దత్తం వినాయక||

శ్రీ సిద్ధిబుద్ధి సమేత వరసిద్ధి వినాయక స్వామినే నమః మహానైవేద్యం సమర్పయామి. (పుష్పంతో నీటిని రెండుసార్లు పళ్లెంలో విడిచిపెట్టాలి)

ఓమ్ అమృతమస్తు! ఓమ్ అమృతోపస్తరణమసి||

(అయిదుసార్లు ఎడమచేతితో కుడిమోచేయిని పట్టుకుని కుడి చేతితో గణపతివైపు నైవేద్యాన్ని చూపాలి)

ఓమ్ ప్రాణాయ స్వాహా ఓమ్ అపానాయ స్వాహా ఓమ్ వ్యానాయ స్వాహా ఓమ్ ఉదానాయ స్వాహా ఓమ్ సమానాయ స్వాహా||(తరువాత సమర్పయామి అన్నప్పుడల్లా పుష్పంతో పళ్ళెంలో నీళ్ళు వదలాలి) మధ్యే మధ్యే పానీయం సమర్పయామి అమృతాపిధానమసి ఉత్తరాపోశనం సమర్పయామి హస్తౌ ప్రక్షాళయామి పాదౌప్రక్షాళయామి శుద్ధాచమనీయం సమర్పయామి||

తాంబూలమ్ : (మూడు తమలపాకులు, వక్కలు, అక్షతలు, పుష్పం, ఫలం సుగంధ ద్రవ్యాలు, దక్షిణలతో తాంబూలాన్ని గణపతి వద్ద ఉంచాలి)

పూగీఫలసమాయుక్తం నాగవల్లీదళైర్యుతం కర్పూర చూర్ణ సంయుక్తం తాంబూలం ప్రతిగృహ్యతామ్||

శ్రీ సిద్ధిబుద్ధి సమేత వరసిద్ధి వినాయక స్వామినే నమః తాంబూలం సమర్పయామి||

సదానంద విఘ్నేశ పుష్కలాని ధనాని చ భూమ్యాం స్థితాని భగవాన్ స్వీకురుష్వ వినాయక||

శ్రీ సిద్ధి బుద్ధి సమేత సిద్ధి వినాయక స్వామినే నమః సువర్ణ పుష్పం సమర్పయామి||

నీరాజనమ్ : (హారతి కర్పూరాన్ని వెలిగించి ఆ దీపాన్ని తిప్పుతూ గణపతికి చూపించాలి)

ఘృతవర్తిసహస్రైశ్చ కర్పూర శకలైస్తదా నీరాజనం మయాదత్తం గృహాణ వరదోభవ||

సమ్రాజంచ విరాజంచ అభిశ్రీః యాచనోగృహే లక్ష్మీరాష్ట్ర్య యాముఖే తయామా సగ్ సృజామసి||

సంతత శ్రీరస్తు సమస్త సన్మంగళానిభవంతు నిత్య శ్రీరస్తు నిత్యమంగళాని భవంతు||

శ్రీ సిద్ధిబుద్ధి సమేత వరసిద్ధి వినాయక స్వామినే నమః నీరాజనం దర్శయామి||

నీరాజనానంతరం ఆచమనీయం సమర్పయామి||

(అని పుష్పంతో పళ్ళెంలో నీటిని విడవాలి)

మంత్రపుష్పమ్ : (ఇక్కడ మంత్రపుష్పాన్ని పెద్దదిగాని, చిన్నదిగాని చెప్పవలెను. రానివారు ఈ శ్లోకాలతో మంత్రపుష్పాన్ని సమర్పించాలి)

గణాధిప నమస్తేస్తు

ఉమాపుత్రా విఘ్ననాశన

వినాయకేశ తనయ సర్వసిద్ధి ప్రదాయక||

ఏకదంతైక వదన తథా మూషికవాహన

కుమారగురవే తుభ్యమర్పయామి సుమాంజలిమ్||

తత్పురుషాయ విద్మహే వక్రతుండాయ ధీమహి

తన్నోదంతిః ప్రచోదయాత్||

శ్రీ సిద్ధిబుద్ధి సమేత వరసిద్ధి వినాయక స్వామినే నమః

మంత్రపుష్పాంజలిం సమర్పయామి.

ఆత్మప్రదక్షిణ నమస్కారమ్ :

ప్రదక్షిణం కరిష్యామి సతతం మోదకప్రియ నమస్తే విఘ్నరాజాయ నమస్తే విఘ్ననాశన||

యానికానిచ పాపాని జన్మాంతర కృతానిచ

తాని తాని ప్రణశ్యంతి ప్రదక్షిణ పదేపదే

పాపోహం పాపకర్మానాం పాపాత్మా పాపసంభవః

త్రాహిమాం కృపయాదేవ శరణాగత వత్సల

అన్యాధా శరణం నాస్తి త్వమేవ శరణం మమ

తస్మాత్కారుణ్యభావేన రక్షరక్ష గణాధిప||

శ్రీ సిద్ధిబుద్ధి సమేత వరసిద్ధి వినాయక స్వామినే నమః

ఆత్మప్రదక్షిణ నమస్కారాన్ సమర్పయామి

## ప్రార్ధన

(పుష్పాక్షతలతో ప్రార్ధించి, తరువాత వాటిని గణపతి పాదాల వద్ద ఉంచాలి)

నమస్తుభ్యం గణేశాయ నమస్తే విఘ్ననాశన ఈప్సితం మే వరం దేహి పరత్ర చ పరాంగతిమ్||

వినాయక నమస్తుభ్యం సతతం మోదకప్రియ నిర్విఘ్నం కురుమేదేవ సర్వకార్యేషు సర్వదా||

అపరాధ సహస్రాణి క్రియంతే అహర్నిశం మయా పుత్రోయమితి మామత్వా క్షమస్వ గణనాయక||

శ్రీ సిద్ధిబుద్ధి సమేత వరసిద్ధి వినాయక స్వామినే నమః ప్రార్ధన నమస్కారాన్ సమర్పయామి||

## సాష్టాంగ నమస్కారమ్

ఉరసా శిరసా దృష్ట్యా మనసా వచసా తథా పాదాభ్యాం కరాభ్యాం కర్ణాభ్యాం ప్రణామోష్టాంగ ఉచ్యతే||

శ్రీ సిద్ధి బుద్ధి సమేత వరసిద్ధి వినాయక స్వామినే నమః సాష్టాంగ నమస్కారాన్ సమర్పయామి||

శ్లో|| మంత్రహీనం క్రియాహీనం భక్తిహీనం గణాధిపతి యత్పూజితం

మయాదేవ పరిపూర్ణంతదస్తుతే అనేన పూజావిధానేన శ్రీ మహాగణాధిపతి

సుప్రీత స్సుప్రసన్నో వరదోభవతు.

(నేను చేసిన పూజలో మంత్రలోపము, క్రియాలోపము, భక్తి లోపము ఉన్నను అవన్నీ మన్నించి గణపతి దేవా పరిపూర్ణ అనుగ్రహాన్ని ప్రసాదించుము.)

అపరాధ ప్రార్ధన :

(రెండు చేతులు జోడించి గణపతికి నమస్కరించి, చెంపలు వేసుకోవాలి)

అపరాధ సహస్రాణి క్రియంతేహం అహర్నిశా పుత్రోయమితి మామత్వా క్షమస్వ గణనాయక||

ఆవాహనం నజానామి నజానామి విసర్జనం పూజాంచైవ నజానామి క్షమ్యతాం గణనాయక||

శ్రీ వరసిద్ధి బుద్ధి సమేత సిద్ధి వినాయక స్వామినే నమః అపరాధ నమస్కారాన్ సమర్పయామి||

(ఈ కింది మంత్రాలను చెబుతూ కొన్ని అక్షింతలు చేతిలో తీసుకొని నీటితో పళ్లెంలో విడిచిపెట్టాలి)

అనేన మయాకృతేన కల్పోక్త ప్రకారేణ గణపతి అష్టోత్తర శతనామ సహిత యావచ్ఛక్తి ధ్యానావాహనాది షోడశోపచార పూజానేన భగవాన్ సర్వాత్మకః శ్రీ సిద్ధిబుద్ధి సమేత వరసిద్ధి వినాయకస్వామిన్ సుప్రీతః సుప్రసన్నః వరదో భవతు.

**కథ చదివేవారు వినేవారు అందరూ అక్షతలు చేతిలో వుంచుకొని కథ వినాలి)**

సూతమహాముని శౌనకాది మునులకు విఘ్నేశ్వరో త్పత్తియు, చంద్రదర్శన దోషకారణంబును, తన్నివారణమును చెప్పదొడంగెను.

పూర్వము గజరూపముగల రాక్షసేశ్వరుండు శివుని గూర్చి ఘోర తపంబొనర్చెను. అతని తపమునకు మెచ్చి పరమేశ్వరుడు ప్రత్యక్షమై వరంబు కోరుకోమనెను. అంత గజాసురుండు పరమేశ్వరుని స్తుతించి, స్వామీ! నీవెల్లప్పుడు నా యుదర మందు వసించియుండుమని కోరెను. భక్త సులభుండగు నా పరమేశ్వరుండాతని కోర్కెదీర్చి గజాసురుని యుదరమందు ప్రవేశించి సుఖంబుననుండెను.

కైలాసమున పార్వతీదేవి భర్త జాడ తెలియక పలుతెరంగుల నన్వేషించుచు కొంత కాలమునకు గజాసుర గర్భస్థుడగుట తెలిసికొని రప్పించుకొను మార్గముగానక పరితపించుచు విష్ణుమూర్తిని ప్రార్థించి తన పతి వృత్తాంతము తెలిపి, "మహాత్మా! నీవు పూర్వము భస్మాసురుని బారి నుండి నా పతిని రక్షించి నాకు యొసంగితివి, ఇప్పుడు కూడా నుపాయాంతరముచే నా పతిని రక్షింపుము" అని విలపింప, శ్రీహరి యా పార్వతి నూరడించి పంపె. అంత నా హరి బ్రహ్మాదిదేవతలను పిలిపించి, గజాసుర సంహారమునకు గంగి రెద్దుమేళమే యుక్తమని నిశ్చయించి, నందిని గంగిరెద్దుగా నలంకరించి, బ్రహ్మాదిదేవతలందరిచేతను తలొక వాద్యమును ధరింపజేసి, తానును చిరుగంటలు, సన్నాయిలు దాల్చి గజాసురపురంబు జొచ్చి జగన్మోహనంబుగా నాడించు చుండగా, గజాసురుండు విని వారలను తన చెంతకు పిలిపించి తన భవనమందు నాడింప నియోగించెను. బ్రహ్మాదిదేవతలు వాద్య విశేషంబుల బోరు సలుప జగన్నాటక సూత్రధారియగు నా హరి చిత్ర విచిత్ర కరంబుగ గంగిరెద్దును ఆడించగా, గజాసురుండు పరమానంద భరితుడై "మీకేమి కావలయునో కోరుడొసంగెద" ననిన, హరి

వానిని సమీపించి, "ఇది శివుని వాహనమగు నంది" శివుని కనుగొనుటకై వచ్చె కావున శివునొసంగు" మనెను.

ఆ మాటలకు గజాసురుడు నివ్వెరపడి, అతనిని రాక్షసాంతకుడగు శ్రీహరిగా నెరింగీ, తనకు మరణమే నిశ్చయమనుకొనుచు తన గర్భస్థుండగు పరమేశ్వరుని "నా శిరసు త్రిలోకపూజ్యముగా జేసి, నా చర్మము నీవు ధరింపు" మని ప్రార్ధించి విష్ణుమూర్తికి అంగీకారము తెలుప నాతడు నందిని ప్రేరేపించెను. నందియు తన శృంగములచే గజాసురుని చీల్చి సంహరించెను. అంత శివుడు గజాసుర గర్భము నుండి బహిర్గతుడై విష్ణుమూర్తిని స్తుతించెను. అంత నా "హరి దుష్టాత్ములకిట్టి వరంబు లీయరాదు... ఇచ్చినచో పామునకు పాలుపోసినట్లగు"నని ఉపదేశించి బ్రహ్మాది దేవతలను వీడ్కొలిపి తాను వైకుంఠమున కేగెను. శివుడు నంది నెక్కి కైలాసమున కతివేగంబున జనియె.

## వినాయకోత్పత్తి:

కైలాసంబున పార్వతీదేవి భర్త రాకను దేవాదుల వలన విని ముదమంది అభ్యంగన స్నానమాచరించుచు నలుగుబిండితో నొక బాలునిగ జేసి, ప్రాణం బొసగి, వాకిలి ద్వారమున కాపుగా నుంచెను. స్నానానంతరము పార్వతి సర్వాభరణముల నలంకరించుకొనుచు పత్యాగమునమును నిరీక్షించుచుండె. అపుడు పరమేశ్వరుడు నంది నధిరోహించి వచ్చి లోపలికి పోబోవ వాకిలి ద్వారముననున్న బాలుడడ్డగించెను. శివుడు కోపించి త్రిశూలముతో బాలుని కంఠంబు దునిమిలోనికేగెను.

అంత పార్వతీదేవి భర్తనుగాంచి, ఎదురేగి, అర్ఘ్యపాద్యాదులచే పూజించె, వారిరువురును పరమానందమున ప్రియభాషణములు ముచ్చటించుచుండ ద్వారమందలి బాలుని ప్రసంగము వచ్చె. అంత నమ్మహేశ్వరుండు తానొనరించిన పనికి చింతించి, తాను తెచ్చిన గజాసుర

శిరంబును బాలునికతికించి ప్రాణంబు నొసంగి "గజాననుడు" అని నామం బొసంగె. అతనిని పుత్ర ప్రేమంబున ఉమామహేశ్వరులు పెంచుకొనుచుండిరి. గజాననుడు తల్లిదండ్రులను పరమభక్తితో సేవించు చుండెను. అతడు సులభముగా ఎక్కి తిరుగుటకు అనింద్యుడను నొక ఎలుక రాజును వాహనముగా జేసికొనెను.

కొంతకాలమునకు పార్వతీ పరమేశ్వరులకు కుమారస్వామి జనియించెను. అతడు మహాబలశాలి. అతని వాహనరాజము నెమలి. దేవతల సేనానాయకుడై ప్రఖ్యాతిగాంచి యుండెను.

## విఘ్నేశాధిపత్యము:

ఒకనాడు దేవతలు, మునులు పరమేశ్వరుని సేవించుచు విఘ్నముల కొక్కని అధిపతిగా తమ కొసంగుమని కోరిరి. గజాననుడు తాను జ్యేష్ఠుడు గనుక అయ్యాధిపత్యము తనకొసంగు మనియు, "గజాననుడు మరుగుజ్జువాడు, అనర్హుడు, అసమర్థుడు గనుక అయ్యాధిపత్యము తన కొసంగు" మని కుమారస్వామియు తండ్రిని వేడుకొనిరి.

శివుండక్కుమారులను జూచి, "మీలో నెవ్వరు ముల్లోకము లందలి పుణ్యనదులలో స్నానమాడి ముందుగా నా యొద్దకు వచ్చెదరో, వారికీయాధిపత్యం బొసంగుదు" నని మహేశ్వరుండు పలుక, వల్లెయని సమ్మతించి కుమారస్వామి నెమలి వాహనంబు నెక్కి వాయు వేగంబున నేగె. అంత గజాననుడు ఖిన్నుడై, తండ్రిని సమీపించి ప్రణమిల్లి "అయ్యా! నా అసమర్థత తామెరింగియు నిట్లానతీయ దగునే!

నీ పాదసేవకుడును నాయందు కటాక్షముంచి తగు నుపాయంబుదెల్పి రక్షింపవే" యని ప్రార్థింప, మహేశ్వరుడు దయాళుడై, కుమారా! ఒకసారి "నారాయణ మంత్రంబు పఠించు" మని ఆ నారాయణ మంత్రాన్ని ఉపదేశించె.

“సకృత్ నారాయణేత్యుక్త్యాపుమాన్ కల్పశతత్రయం గంగాది సర్వతీర్థేషు స్నాతో భవతి పుత్రక”

అంత గజాననుడు సంతసించి, అత్యంత భక్తితో నమ్మంత్రంబు జపించుచు కైలాసంబున నుండె.

అమ్మంత్ర ప్రభావంబున అంతకు పూర్వము గంగానదికి స్నానమాడనేగిన కుమారస్వామికి గజాననుండా నదిలో స్నానమాడి తన కెదురుగా వచ్చుచున్నట్లు గాన్పింప, నతండును మూడు కోట్ల ఏబది లక్షల నదులలో కూడ అటులనే చూచి ఆశ్చర్యపడుచు, కైలాసంబున కేగి తండ్రి సమీపమందున్న గజాననుని గాంచి, నమస్కరించి, తన బలమును నిందించుకుని “తండ్రీ! అన్నగారి మహిమ తెలియకట్లంటిని క్షమింపుము. ఈ ఆధిపత్యంబు అన్నగారికే యొసంగు” మని ప్రార్థించెను.

అంత పరమేశ్వరునిచే భాద్రపద శుద్ధ చతుర్థినాడు గజాననునికి విఘ్నాధిపత్యం బొసంగబడియె. ఆనాడు సర్వదేశస్తులు విఘ్నేశ్వరుని తమ విభవముల కొలది కుడుములు, అప్పములు మున్నగు పిండివంటలు, టెంకాయలు, పాలు, తేనె, అరటి పండ్లు, పానకము, వడపప్పు మొదలగునవి సమర్పించి పూజింప, విఘ్నేశ్వరుండు సంతుష్టుడై కుడుములు మున్నగునవి భక్షించియు, కొన్ని వాహనమున కొసంగియు, కొన్ని చేత ధరించియు మందగమనంబున సూర్యాస్తమయం వేళకు కైలాసంబున కరిగి తల్లిదండ్రులకు ప్రణామంబు సేయబోవ ఉదరము భూమి కానిన చేతులు భూమి కందవయ్యే, బలవంతంబుగ చేతులానిన చరణంబులాకాశంబు జూచె, ఇట్లు దండ ప్రణామంబుసేయ గడు శ్రమనొందుచుండ, శివుని శిరంబున వెలయు చంద్రుడు జూచి వికటంబుగ నవ్వె, అంత ‘రాజదృష్టి’ సోకి నరాలుకూడ నుగ్గగు నను సామెత నిజమగునట్లు విఘ్నదేవుని గర్భంబు పగిలి అందున్న కుడుములు తత్ప్రదేశంబెల్లెడల దొర్లెను. అతండును మృతుండయ్యె, పార్వతి శోకించుచు చంద్రుని జూచి,

"పాపాత్ముడా! నీ దృష్టి తగిలి నా కుమారుడు మరణించెను గాన, నిన్ను చూచినవారు పాపాత్ములై నీలాపనిందలు నొందుదురుగాక" అని శపించెను. ఆ సమయంబున సప్తమహర్షులు యజ్ఞంబు చేయుచు తమ భార్యలతో ప్రదక్షిణము చేయుచుండిరి. అగ్నిదేవుడు ఋషి పత్నులను చూచి మోహించి శాప భయంబున అశక్తుడై క్షీణించు చుండగా, నయ్యది అగ్ని భార్యయగు స్వాహాదేవి గ్రహించి అరుంధతీ రూపము దక్క తక్కిన ఋషిపత్నుల రూపంబు తానే దాల్చి పతికి ప్రియంబు చేసె, ఋషులద్దానిఁగనుగొని అగ్నిదేవునితో నున్నవారు తమ భార్యలేయని శంకించి తమ భార్యలను విడనాడిరి. పార్వతీ శాపానంతరము ఋషిపత్నులు చంద్రుని చూచుటచే వారికట్టి నీలాపనింద కలిగినది.

ఋషిపత్నుల యాపద పరమేష్టికి దెల్ప నాతండు సర్వజ్ఞుండగుటచే అగ్నిహోత్రుని భార్యయే ఋషి పత్నుల రూపంబు దాల్చి వచ్చుటం దెల్పి సప్త ఋషులను సమాధానపరచె. వారితో కూడా బ్రహ్మ కైలాసంబున కేతెంచి, ఉమామహేశ్వరుల సేవించి మృతుడై పడియున్న విఘ్నేశ్వరుని బ్రతికించి ముదంబుగూర్చె.

అంత దేవాదులు, "ఓ పార్వతీ దేవి! నీ శాపంబున లోకంబులకెల్ల కీడు వాటిల్లుచున్నది. దాని నుపసంహరింపు" మని ప్రార్థింప, పార్వతి సంతసించి, "ఏ దినంబున విఘ్నేశ్వరుని చూచి చంద్రుడు నవ్వెనో నా దినంబున చంద్రుని జూడరాద" ని శాపోపశమనంబునొసంగె, అంత బ్రహ్మాదులు సంతసించి తమ గృహంబులకేగి, భాద్రపద శుద్ధ చతుర్థియందు మాత్రము చంద్రుని జూడక జాగరూకులై సుఖంబుగ నుండిరి.

## శ్యమంతకోపాఖ్యానము

యదువంశమునందు సత్రాజిత్తు, ప్రసేనుడు అను సోదరులుండిరి. వారు నిఘ్నుని కుమారులు. సత్రాజిత్తునకు సూర్యభగవానుడు మిత్రుడు. ఒకనాడు సత్రాజిత్తు సూర్యభగవానుని

స్తుతించెను. తదేక మనస్కుడై సత్రాజిత్తు చేసిన స్తుతికి ప్రసన్నుడై సూర్యభగవానుడు అతనికి ప్రత్యక్షమయ్యేను. అంతట సత్రిజుత్తు సూర్యునకు ప్రణామములు చేసి స్తుతించెను. ప్రసన్నుడైన సూర్యుడు వరమును కోరుకొనమనెను. అంతట సత్రాజిత్తు సూర్యుని నుండి "శ్యమంతకమణి"ని కోరెను. అది విని సూర్య భగవానుడు శ్యమంతకమణిని తన కంఠం నుండి తీసి సత్రాజిత్తునకు ఇచ్చెను. ఆ సమయమున సూర్యుడు సత్రాజిత్తుతో ఇట్లు పలికెను. ఆ దివ్యమణిని పవిత్రుడై ధరించినచో ప్రతిదినమా మణి ఎనిమిది బారువుల బంగారము ననుగ్రహించును. ఆ మణియున్న దేశమున అనావృష్టి, ఈతిబాధలు, అగ్ని, వాయు, విషక్రిములచే ఉపద్రవములు, దుర్భిక్షము మొదలగునవి వుండవు. కానీ అశుచియై ధరించినచో అది ధరించిన వానిని చంపును.

ఈ విషయములను తెలిసికొని, సత్రాజిత్తు సూర్యుని నుండి మణిని గ్రహించి, ధరించి, పురవీధులలో నడిచి వచ్చుచుండగా చూసిన పౌరులు దాని కాంతికి భ్రమించి సూర్యభగవానుడే శ్రీకృష్ణదర్శనమునకై వచ్చుచున్నాడని భావించి, ఆ విషయము శ్రీ కృష్ణునకు నివేదించిరి. శ్రీ కృష్ణుడు అట్టి రత్నము ప్రభువు వద్ద ఉన్నచో దేశాభివృద్ధికి, ప్రజా సంక్షేమమునకు ఉపయోగపడునని ఆ మణిని ప్రభువైన ఉగ్రశేనునికి ఇప్పింప సంకల్పించెను.

అది తెలిసిన సత్రాజిత్తు ఆ దివ్యమణిని తనతమ్ముడైన ప్రసేనునకిచ్చెను. ప్రసేనుడు ఆ మణిని ధరించి వేటకై ఆరణ్యమునకు వెళ్ళెను. కొంత సమయమునకు శరీరశోధన కారణముగ ప్రసేనుడు అశౌచమును పొందెను.

ఆ కారణముచే ప్రసేనుడు సింహము చేతిలో మరణించెను. ఆ సింహమును జాంబవంతుడను భల్లూకము సంహరించి ఆ మణిని తీసుకొనిపోయి దానిని గూహలో ఊయలలో నున్న తన కుమారునకు ఆట వస్తువుగా ఇచ్చెను. ఆ పిల్లవాని పేరు సుకుమారుడు. ప్రసేనుడు అరణ్యములోనికి వేటకై వెళ్ళినపుడు శ్రీ కృష్ణుడు కూడా వెంట వెళ్ళెను. ఆనాడు

భాద్రపద శుక్ల చవితి. ప్రదోష వేళలో ప్రసేనుడు సంహరింపబడెను. వానికై వెదుకుచూ శ్రీ కృష్ణుడు తలెత్తి చూడగ ఆకాశమున శుక్లపక్ష చవితినాటి చంద్రబింబము కనపడెను. చీకట్లుబాగుగా ముసురుకున్న కారణముచే శ్రీ కృష్ణుడు తన మందిరమునకు తిరిగి వచ్చెను. దానికి పూర్వము, దేశ ప్రయోజనాల కొరకై ఆ మణిని శ్రీ కృష్ణుడు కోరిన కారణము చేత, అతడే ప్రసేనుని చంపి మణినపహరించెనని సత్రాజిత్తు, పౌరులు, భావించిరి. అంతట ఆ అపవాదును బాపుకొనుటకై, శ్రీకృష్ణుడు మరునాడు, అడవిలో శోధింపగా ఎముకలు, చిరిగిన బట్టలు, తెగిపడిన ఆభరణములు కనబడెను, దానిని ప్రసేనుని గుర్రమును ఏదో క్రూరమృగము చంపి ఉండునని కృష్ణుడు భావించెను. అచ్చట గుర్రపు పాదముద్రలు ఆగిపోయి, ఒక సింహపు పాదముద్రలు కనబడెను. శ్యమంతకమణి మాత్రము దొరకలేదు. కాని కృష్ణుని వెంట వచ్చిన సత్రాజిత్తు సన్నిహితులు, కృష్ణుడే ముందటి రోజు ప్రసేనుని సంహరించి, శ్యమంతకమణిని అపహరించెననియు. రాత్రి వేళ సింహము ప్రసేనుని, అతని గుర్రమును తిని యుండునని నిష్టూరముగా పలికిరి.

ఈ అపవాదు నుండి తప్పించుకొనుటకై శ్రీ కృష్ణుడు మరింత ప్రయత్నము ప్రారంభించెను. కొంత దూరము వెళ్ళగా అచట సింహపు కళేబరము కనబడెను. అచ్చటినుండి భల్లూకపు పాదముద్రలు కనబడెను. వాని ననుసరించి వెళ్ళి ఒక గుహలోనికి ప్రవేశించెను. అచ్చట యవ్వనమునందున్న ఒక యింతి ఊయలలో పరున్న బాలుని ఊపుచుండెను. ఊయల పై ఆట వస్తువుగా శ్యమంతకమణి కట్టబడి ఉండెను. ఊయల ఊపుచున్న ఆ లలనయే జాంబవతి. ఆమె కృష్ణుని చూచి ఆయన సౌందర్యమునకు వశపడి, బహుశః ఆయన శ్యమంతకమణికై వచ్చెనని భావించి, గట్టిగా మాట్లాడినచో తన తండ్రి జాంబవంతుడు వచ్చి శ్రీ కృష్ణునకేమైనా ఆపద కల్పించునేమోనని భీతిచెంది, పాటపాడుచున్న దాని వలె ఆ శ్యమంతకమణి వచ్చిన విధమునిట్లు చెప్పెను.

శ్లో|| సింహః ప్రసేనమవధీః

సింహో జాంబవతాహతాః

సుకుమారక మారోధీః

తవ హ్యేష శ్యమంతకః!!

తా|| ప్రసేనుని వధించిన సింహమును జాంబవంతుడు వధించి, శ్యమంతకమణిని తెచ్చెను. ఓ సుకుమారుడా!

ఈ మణి నీకే ఏడవకుము.

అంతలో లోపల నిద్రించుచున్న జాంబవంతుడు లేచి వచ్చి, శ్యమంతకమణి కొరకై శ్రీ కృష్ణుడు వచ్చెనని శంకించి, ద్వంద యుద్ధమునకు తలపడెను. ఆ కృష్ణుడే రామావతార కాలమున జాంబవంతునికి చిరంజీవిగా వరమిచ్చెను. ఆ కాలమున జాంబంవంతునకు రాముని ఆలింగనమొనర్చుకొనవలెనని కోర్కె యుండెడిది. కాని కృష్ణుడు ఆ కోర్కెనిప్పుడు తీర్చుటకై జాంబవంతునితో ఇరవైయొక్క (21) రోజుల పాటు యుద్ధమొనర్చెను.

క్రమముగా జాంబవంతుని బలము తగ్గి కృష్ణుడే రాముడని తెలిసికొని ఆయన పాదములపై పడి ప్రార్థించి శ్యమంతకమణితో పాటుగా తన కుమార్తె ఆయిన జాంబవతిని శ్రీ కృష్ణునికిచ్చి సాగనంపెను. ద్వారాకానగర పౌరులకు ఈ సత్యము తెలిసి, శ్రీకృష్ణుడు శ్యమంతకమణిని సత్రాజిత్తునకిచ్చివేసెను. అప్పుడు సత్రాజిత్తు తన తప్పు తెలిసికొని శ్రీ కృష్ణుని క్షమింపమని ప్రార్థించి, తన కన్యారత్నమైన సత్యాభామను, మణిరత్నమైన శ్యమంతకమణిని గోపాలరత్నమైన శ్రీకృష్ణునకు సమర్పించెను.

కృష్ణుడు భూదేవి అవతారమైన సత్యభామను గ్రహించి శ్యమంతకమణి సత్రాజిత్తునకే ఇచ్చివేసెను.ఈలోగా పాండవులు, కుంతీదేవి, లక్క ఇంటిలో కాలి మరణించినారని వార్త వచ్చెను. శ్రీ కృష్ణునకు వారు సజీవులై ఉన్నారని తెలిసినప్పటికీ, కుటుంబ పెద్ద అయిన  ధృతరాష్టుని అనునయించుట, లౌకిక మర్యాదగా భావించి, హస్తినాపురమునకు వెళ్ళెను. యాదవుల యందే శతధన్యుడు, కృతవర్మ, అక్రూరుడను ముగ్గురు ప్రముఖులుండెడివారు సత్యభామను శ్రీకృష్ణునకిచ్చి పరిణయము చేయుటకు పూర్వము, వీరు ముగ్గురు ఆమెను తమకిచ్చి వివాహము చేయమని సత్రాజిత్తునడిగిరి. వారిలో ఒకరికి సత్యభామ నిత్తునని సత్రాజిత్తు వాగ్ధానమొనర్చెను.  కానీ అనుకోని పైన పరిణామములతో సత్యభామను శ్రీకృష్ణునకిచ్చి వివాహ మొనర్చెను.

దానిచే కక్ష పెంచుకొనిన ఈ ముగ్గురు, ఏకమై కృష్ణుడు లేని సమయమెరిగి, సత్రాజిత్తును సంహరించి శ్యమంతకమణిని అపహరింపమని శతధన్యుని ప్రేరెపింపగా, అతడట్లే చేసి ఆ మణిని అక్రూరుని వద్ద వదలి పారిపోయేను,  ఇది తెలిసి శ్రీ కృష్ణుడు హస్తినాపురమునుండి వచ్చి, సత్యభామను ఓదార్చి శతధన్యుని సంహరించుటకై బలరామునితో కలిసి రథములో బయల్దేరెను. గుర్రముపై పారిపోవుచున్న  శతధన్యుడు, అది అలసి పడిపోగా, దానిని వదిలి పరుగిడుచుండెను.

అంతట కృష్ణుడు  బలరాముని రథమందుండమని, తాను దిగి శతధన్యుని వెంబడించి, పట్టి ద్వంద యుద్దంలో  అతనిని సంహరించి ఒడలంతయు వెదుకగా, మణి దొరకదయ్యే అంతట కృష్ణుడు  తిరిగి వచ్చి  బలరామునకా విషయము తెలుపగా, అతుడు కృష్ణునితో నీవు బాల్యమునుండియూ చోరుడవు,  ఇప్పుడు ఆ మణిని నేనడిగెదనని శంకించి, దానిని దాచివైచి నీవిట్లు చెప్పుచున్నావని శ్రీ కృష్ణుని నిందించి, నీతో కలిసి యుండనని, విదేహ రాజ్యమునకు వడలి పోయేను.

బాహ్యాశౌచము లేక మణిని ధరించి ప్రసేనుడు మరణించెను. అంతః శౌచము లేక (శ్రీకృష్ణుని అనుమానించుటచే) సత్రాజిత్తు మరణించెను. పరమ భక్తుడైనప్పటికినీ, తాత్కాలికముగా భగవద్విరోధ భావమునొందిన అక్రూరుడు మనః శ్శాంతికై తీర్థయాత్ర చేయుచూ, కాశీ పట్టణమునకు చేరెను. అచ్చటికి పోగానే మనఃశ్శాంతిని పొంది శ్యమంతకమణి వలన ప్రతిదినము వచ్చు బంగారమును దైవకార్యములకు ఉపయోగించెను. అక్రూరుడు బాహ్యాభ్యంతర శౌచమును పొంది యుండుటచే అచ్చట అతివృష్టి, అనావృష్టి రోగబాధలు లేక ప్రశాంతముగానుండెను.

ఇచ్చట శ్రీ కృష్ణుడు బలరామునిచే నిందింపబడి ఒక్కడే తిరిగి ద్వారక నగరమునకు చేరెను. ఈ మణి విషయమై తమ దండ్రులకు కీర్తి కలుగరాదని శ్రీకృష్ణుడు ఏదో మాయ చేసెనని, జాంబవతి, సత్యభామలు అనుమానించిరి. శ్రీకృష్ణుడు ఈ అపనిందలకు కారణమేమాయని ఆలోచించుచుండగా నారదుడేతెంచి భాద్రపద శుక్ల చవితినాటి రాత్రి ప్రసేనునితో అడవికి వెళ్ళినపుడు చంద్రుని చూచుటయే కారణమని, తద్విశేషమును ఇట్లు చెప్పెను.

శశివర్ణుడను పేరుగల మహహాగణపతి, అన్ని లోకములలో విహరించుచూ ఒకనాడు చంద్రలోకమునకు చేరెను. బాహ్యమున వినాయకుడు మరుగుజ్జు, లంబోధరుడు, అయినప్పటికీ హృదయమున మిక్కిలి కారుణ్యమూర్తి. కానీ చంద్రుడు పైకి అందగాడైనప్పటికీ, కవులచే వర్ణింపబడినప్పటికీ నడవడియందు దోషములున్నవాడు. అట్టి చంద్రుడు వినాయకుని చూచి వికటముగా నవ్వెను. అప్పుడు చంద్రుని అహంకారమును తగ్గించుటకై వినాయకుడు, ఎవ్వరేని చంద్రుని చూసినచో అపనిందలు పొందెదరని శపించెను. దానిచే జనులెవ్వరు చంద్రుని చూడరైరి. దానితో కుంగినవాడై చంద్రుడు తాను జన్మించిన క్షీరసాగరములోనికి వెళ్ళిపోయెను.

చంద్రకాంతిలేమిచే ఓషధులు పలించుట మానెను. ప్రజలకు ఆహ్లాదము కరువాయేను. దీనిచే దయతలిచి, దేవతలు, ఋషులు, బ్రహ్మగారి వద్దకు పోయి నివారణోపాయము నర్థించిరి. అంతట బ్రహ్మ బాద్రపద శుక్ల చవితి నాడు నక్తవ్రత మొనరింపవలెననీ (పగటి ఉపవాసము) విఘ్నేశ్వరుని పూజించి, మోదకములు, (ఉండ్రాళ్ళు,), పండ్లు, కుడుములు, ప్రత్యేకించి దోసపండు, నివేదన మొనరింపవలెనని, సూచించెను. అప్పుడు చంద్రుడు కూడా ఆ వ్రతమొనర్చి వినాయకుని అనుగ్రహమును పొందెను.

అంతట వినాయకుడు, ఒక్క తన అవతారదినమైన భాద్రపద శుక్ల చవితినాటి రాత్రి తప్ప మిగిలిన రోజులలో చంద్రుని చూచినను ఎట్టి నిందలు కలగవని శాపావకాశమిచ్చెను. అంతట భాద్రపద శుక్ల చవితినాటి చంద్రదర్శనముచే తనకు కలిగిన నిందలను పోగొట్టుకొనుటకై నారదుని సలహా మేరకు శ్రీకృష్ణుడు వినాయక వ్రతమాచరించెను. వెంటనే వినాయకుడు ప్రత్యక్షమై శ్రీ కృష్ణునికి వచ్చిన అపనిందలు తొలగిపోవునని మంగళవాక్కులు పలికెను. అంతట శ్రీ కృష్ణుడు తాను సమర్థతతో ఇంత కష్టపడితిని గాని, సామాన్యులకది ఎట్లు సాద్యమగుననీ, కాన లోకమంతటినీ అనుగ్రహింపమని కోరెను.

భాద్రపద శుక్ల చవితినాడు తనను పూజించి, శ్యమంతకోపాఖ్యానమును చదివిన మరియు విన్నా, చంద్రుని చూచిననూ అపనిందలు కలగవని వినాయకుడు వరమిచ్చెను. ద్వారకా నగరమునందు కలిగిన క్షామ నివారణకు మాహా భక్తుడైన అక్రూరుని రాక అవసమని భావించి, శ్రీ కృష్ణుడు అక్రూరునకు కబురుపంపెను. పరమభక్తుడైన అక్రూరుడు ద్వారక నగరమునకు వచ్చుటచే, అందరికి శ్యమంతకమణి వృత్తాంతము తెలిసి శ్రీకృష్ణుని పై వచ్చిన అపనిందలు తొలగిపోయినవి. లోపల, బయట, శౌచము కల అక్రూరుని వద్ద శ్యమంతకమణి శుభ పరంపరలిచ్చుచూండెను. కావున ఈ వ్రత సమయమందు. జాంబవతి ఊయల ఊపుచూ చెప్పిన శ్లోకము అందరు తప్పక పటింపవలెను.

సింహః ప్రసేనమవధీః సింహో జాంబవతాహతాః

సుకుమారక మారోధీః తవ హ్యేష శ్యమంతకః!!

గణేషరత్నము కూడా మనవై వారి అనుగ్రహముచే ఎల్లరూ ఆయురారోగ్య ఐశ్వర్యములను పొందెదరు.

"మంగళం మహత్"

చేతిలో వున్న అక్షతలను కొన్ని విఘ్నేశ్వరుని పాదాల చెంత వుంచి కొన్ని మీ శిరస్సుపై వేసుకొని మిగిలినవి మీ పిల్లల శిరస్సుపై వేసి దీవించవలెను.

కథ సమాప్తం

పునఃపూజ :

ఛత్రమాచ్ఛాదయామి చామరేణ వీచయామి నృత్యం దర్శయామి గీతం శ్రావయామి ఆందోళికా నారోహయామి గజానారోహయామి అశ్వానారోహ యామి సమస్త రాజోపచార, భక్త్యోపచార, శక్త్యోపచార పూజాన్ సమర్పయామి||

(స్వామిపై పుష్పాక్షతలు వేయాలి)

## విఘ్నేశ్వరుని మంగళహారతులు

శ్రీ శంభుతనయునకు సిద్ధిగణనాధునకు వాసిగల దేవతా వంద్యునకును ఆ సరసవిద్యలకు ఆదిగురువైనట్టి భూసురోత్తమ లోకపూజ్యునకును జయ మంగళం నిత్య శుభమంగళం!

నేరేడు మారేడు నెలవంక మామిడి దూర్వారచెంగల్వ ఉత్తరేణు వేరువేరుగా దెచ్చి వేడ్కతో పూజింతు పర్వమున దేవ గణపతికి నెపుదు ||

సుచిరముగ భాద్రపద శుద్ధచవితి యందు పొసగ సజ్జనులచే పూజగొల్తు శశి చూడరాదన్న జేకొంటినొక వ్రతము పర్వమున దేవగణపతికి నిపుడు ||జయ||

పానకము వడపప్పు పనస మామిడి పండ్లు దానిమ్మ ఖర్జూర ద్రాక్షపండ్లు తేనెతో మాగిన తియ్యమామిడిపండ్లు మాకు బుద్ధినిచ్చు గణపతికినిపుడు ||జయ||

ఓ బొజ్జ గణపయ్య నీ బంటు నేనయ్య ఉండ్రాళ్ల మీదికి దండుపంపు కమ్మనీ నెయ్యియు కడుముద్దపప్పును బొజ్జనిండుగ దినుచును పొరలుచును ||జయ ||

వెండి పళ్లెములోన వేవేల ముత్యాలు కొండలుగ నీలములు కలయబోసి మెండుగను హారములు మెడ నిండ వేసుకొని దండిగా నీకిత్తు ధవళారతి ||జయ ||

పువ్వులను నినుగొల్తు పుష్పాల నినుగొల్తు గంధాల నినుగొల్తు కస్తూరినీ ఎప్పుడూ నినుగొల్తు ఏకచిత్తమ్మున పర్వమున దేవగణపతికి నిపుడు ||జయ ||

ఏకదంతంబున ఎల్లగజవదనంబు బాగైన తొండంబు వలపు కడుపు జోకయిన మూషికము పరకనెక్కాడుచు భవ్యుడగు దేవ గణపతికి నిపుడు ||జయ ||

మంగళము మంగళము మార్తాండ తేజునకు మంగళము సర్వజ్ఞ వందితునకు మంగళము ముల్లోక మహిత సంచారునకు మంగళము దేవ గణపతికి నిపుదు ||జయ ||

సిద్ధి విఘ్నేశ్వర ప్రసిద్ధిగా పూజింతు ఒనరంగ నిరువది యొక్క పత్రి దానిమ్మ మరువమ్ము దర్భవిష్ణుక్రాంత యుమ్మెత్త దూర్వార యుత్తరేణి ||జయ ||

కలువలు మారేడు గన్నేరు జిల్లేడు దేవకాంచన రేగు దేవదారు జాజి బలురక్కసి జమ్మిదానపువ్వు గరిక మాచిపత్రి మంచి మొలక ||జయ ||

అగరు గంధాక్షత ధూప దీప నైవేద్య తాంబూల పుష్పోపహారములును భాద్రపద శుద్ధ చవితిని కుడుములు నానుబాలు ఉండ్రాళ్లు పప్పు ||జయ ||

పాయసము జున్ను తేనెయు భక్తిమీర కోరి పూజింతు నిన్నెపుడు కోర్కెలలర ||జయ ||

బంగారు చెంబుతో గంగోదకము దెచ్చి సంగతిగ శిశువునకు జలకమార్చి మల్లెపువ్వుల దెచ్చి మురహరిని పూజింతు రంగైన నా ప్రాణలింగమునకు ||జయ ||

పట్టు చీరలు మంచి పాడిపంటలు గల్గి ఘనముగా కనకములు కరులు హరులు యిష్ట సంపదలిచ్చి యేలిన స్వామికి పట్టభద్రుని దేవగణపతికి నిపుడు ||జయ ||

ముక్కంటి తనయుడని ముదముతో నేనును చక్కనైన వస్తుసమితి గూర్చి నిక్కముగ మనమును నీయందె నేనిల్పి ఎక్కుడగు పూజలాలింప జేతు ||జయ ||

మల్లెలా మొల్లలా మంచి సంపెంగలా చల్లనైనా గంధసారము లను ఉల్లమలరగ మంచి ఉత్తమపు పూజలు కొల్లలుగ నేజేతు కోరి విఘ్నేశ ||జయ ||

దేవాదిదేవునకు దేవతారాధ్యునకు దేవేంద్రవంద్యునకు దేవునకును దేవతలు మిముగొల్చి తెలిసి పూజింతురు. భవ్యుడగు దేవగణపతికి నిపుడు ||జయ ||

చెంగల్వ చేమంతి చెలరేగి గన్నేరు తామరలు తంగేడు తరచుగాను పుష్పజాతులు తెచ్చి పూజింతు నేనిపుడు బహుబుద్ధి గణపతికి బాగుగాను ||జయ ||

మారేడు మామిడి మాదీఫలంబులు ఖర్జూర పనసలును కదళికములు నేరేడు నెంవంది టెంకాయ తేనెయు చాలగా నిచ్చెదరు చనువుతోడ ||జయ ||

ఓ బొజ్జగణపతి ఓర్పుతో రక్షించి కాచి నన్నేలు మీ కరుణతోను మాపాలగలవని మహిమీద నెల్లపుడు కొనియాడుచుందును కోర్కెదీర జయమంగళం నిత్య శుభమంగళం! ||జయ ||

## వాయనదానము

శ్లో|| గణేశః ప్రతిగృహ్ణాతు గణేశో వైదదాతి చ

గణేశః తారకోభాభ్యాం గణేశాయ నమోనమః

(ఈ శ్లోకము వాయనమిచ్చువారు చెప్పవలెను)

మంత్రము – దేవస్యత్వాసవితుః ప్రసవేశ్వినోర్బాహుభ్యాం

పూషోహస్తాభ్యామా దదా!

(ఈ మంత్రము వాయనము పుచ్చుకొనువారు చెప్పవలెను)

ఉద్వాసన మంత్రము : (ఈ క్రింది మంత్రంతో గణపతి ప్రతిమ ఈశాన్యదిశగా మూడుసార్లు కదపవలెను)

యజ్ఞేన యజ్ఞమయజంత దేవాః తాని ధర్మాణి ప్రథమాన్యాసన్||

తేహనాకం మహిమానస్యచంతే యత్రపూర్వే సాధ్యాస్సంతి దేవాః||

శ్రీ సిద్ధిబుద్ధి సమేత సిద్ధి వినాయక స్వామిన్ యథాస్థాన ముద్వాసయామి||

పూజా విధానం సంపూర్ణమ్.

## వ్రతకల్ప పూజా విధానం సమాప్తం

॥సర్వేజనాస్సుఖినో భవంతు ॥

## చంద్రదర్శన దోషశాంతి శ్లోకం

వినాయక చతుర్థినాడు చంద్రుని చూడరాదు. పొర పాటున చూచినచో విష్ణుపురాణములోని ఈ క్రింది శ్లోకమును చదివినచో ఆ దోషము తొలగిపోవునని నిర్ణయ సింధువులో చెప్పబడినది.

సింహః ప్రసేనమవధీః సింహో జాంబవతాహతాః

సుకుమారక మారోధీః తవ హ్యేష శ్యమంతకః!!

## అదనపు సమాచారం

## శ్రీ వినాయక దండకం

శ్రీ పార్వతీపుత్ర లోకత్రయీస్తోత్ర, సత్పణ్యచారిత్ర, భద్రేభవక్త్రా మహాకాయ, కాత్యాయనీ నాధ సంజాతస్వామి శివాసిద్ధి విఘ్నేశ, నీ పాద పద్మంబులన్, నిదు కంటంబు నీ బొజ్జ నీ మోము నీ మౌళి బాలేందు ఖండంబు నీ నాల్గు హస్తంబు నీ కరలంబు నీ పెద్ద వక్త్రంబు నీ పాద హస్తంబు లంబో దరంబున్ సదమూషకాశ్వంబు నీ మంద హాసంబు నీచిన్న తొండంబు నీ గుజ్జ రూపంబు నీ సూర్పకర్ణంబు నీ నాగ యజ్ఞోపవీతంబు నీ భవ్య రూపంబు దర్శించి హర్షించి సంప్రీతి మ్రొక్కంగ శ్రీ గంధమున్ గుంకుమంబక్ష తాల్జాజులున్ చంపకంబుల్ తగన్ మల్లెలున్మోల్లులు న్మంఛి చేమంతులున్ దేల్లగాన్నేరులున్ మంకెనలన్ పోన్నలన్ పువ్వులు

న్మంచి దూర్వంబులన్ దెచ్చి శాస్త్రోక్తరీతిన్ సమర్పించి పూజించి సాష్టాంగముంచేసి విఘ్నేశ్వరా నీకుతేంకాయ పోన్నంటిపండ్లున్ మజీన్మంచివౌ నిక్షుఖండంబులన్ రేగుబండ్లప్పడాల్ వడల్ నేయిబూరెల్ మరిన్ గోదుమప్పంబులు న్వడల్ పునుగులున్బూరేలున్ న్గారెలున్ చొక్కమౌ చల్మిడిన్ బెల్లమున్ దేనెయుంజున్ను బాలాజ్యము న్నాను బియ్యంచామ్రంబు బిల్వంబు మేల్ బంగురున్ బల్లెమందుంచి నైవేద్య బంచనీరానంబున్ నమస్కారముల్ చేసి విఘ్నేశ్వరా! నిన్ను బూజింపకే యన్యదైవంబులం బ్రార్ధనల సేయుటల్ కాంచనం బోల్లకే యిన్ము దాగోరు చందంబుగాదే మహాదేవ ! యోభక్తమందార ! యోసుందరాకారా ! యోభాగ్య గంభీర ! యోదేవ చూడామణీ లోక రక్షా మణీ ! బందు చింతామణీ ! స్వామీ నిన్నెంచ, నేనంత నీ దాసదాసాది దాసుండ శ్రీ దొంతరాజాన్వ వాయుండ రామాబిధానుండ నన్నిష్ట చేపట్టి సుశ్రేయునించేసి శ్రీమంతుగన్ జూచి హృత్పద్మ సింహాసనారూడతన్ నిల్పి కాపాడుటేకాడు విన్గోల్చి ప్రార్ధించు భక్తాళికిన్ గోంగు బంగారమై కంటికిన్ రెప్పవై బుద్ధియున్ విద్యయున్ పాడియున్ బుత్రపౌత్రాభివృద్ధిన్ దగన్ కల్గగాజేసి పోషించు మంటిన్ గృహన్ గావుమంటిన్ మహాత్మా యివే వందనంబుల్ శ్రీ గణేశా ! నమస్తే నమస్తే నమస్తే నమః ||

## వినాయక మంగళాచరణము

ఓ బొజ్జగణపయ్య నీ బంటు నేనయ్య ఉండ్రాళ్ళ మీదికి దండు పంపు

కమ్మనినేయుయి కడుముద్దపప్పును బొజ్జవిరగ గదినుచు పొరలుకొనుచు – జయమంగళం నిత్య శుభమంగళం!!

వెండి పళ్ళెములో వేయివేల ముత్యాలు కొండలుగ నీలములు కలయబోసి

మెండుగను హారములు మెడనిండ వేసుకొని దండిగా నీకిత్తుఘనహారతి – జయమంగళం నిత్య శుభమంగళం!!

శ్రీ మూర్తి వ్యందునకు చిన్మయానందునకు భాసురోతునకు శాశతునకు

సోమార్కనేత్రునకు సుందరాకారునకు కామరూపునకు శ్రీగణనాథునకు – జయమంగళం నిత్య శుభమంగళం!!

ఏకదంతమును ఎల్లగజవదనంబు బాగైన తొండంబు కడుపుగలుగు

బోడైన మూషికము సొరదినెక్కాడుచు భవ్యముగ దేవగణపతికినిపుడు – జయమంగళం నిత్య శుభమంగళం!!

చెంగల్వ చామంతి చెలరేగి గన్నేరు తామర తంగేడు తరచుగాను

పుష్పజాతూ దెచ్చి పూజింతు నేనిపుడు బహుబుద్ధి గణపతికి బాగుగాను – జయమంగళం నిత్య శుభమంగళం!!

## విద్యార్థులు చదవవలసిన శ్లోకాలు

**తొండము నేకదంతమును తోరపు బొజ్జయు వామహస్తమున్**

**మెండుగ మ్రోయు గజ్జెలును మెల్లని చూపుల మందహాసమున్.**

**కొండొక గుజ్జురూపమున కోరిన విద్యలకెల్ల నొజ్జయై**

**యుండెడి పార్వతీ తనయ ఓయి గణాధిప నీకు మొక్కెదన్**!!!.

**తొలుత నవిఘ్నమస్తనుచు ధూర్జటీ నందన నీకు మ్రొక్కెదన్**

**ఫలితము సేయవయ్య నిని ప్రార్థన సేసెద నేకదంత నా**

**వలపటి చేతి ఘంటమున వాక్కున నెపుడు బాయకుండుమీ**

**తలపున నిన్ను వేడెదను దైవగణాధిప లోక నాయకా**!!!!

## సనాతన హిందూ సాంప్రదాయాలు గ్రూప్, ఛానల్ తరపున మేము ప్రతి రోజూ పోస్టు చేస్తున్న పోస్టుల సమగ్ర వివరాలు

1) పంచాంగం

2) సుందరకాండ

3) మహా భారతము

4) ద్వాదశ రాశుల వారి జాతక ఫలితాలు

5) మంచి మాటలు- సూక్తులు

6) నిత్య దేవతా స్తోత్రాలు

7) భగవద్గీత నీతి వాక్యాలు

8) పురాణ ప్రశ్నలు- సమాధానము

9) తెలుగు సుభాషితాలు

10) క్షేత్ర సందర్శనం

11) భగవద్గీత

12) గణపతి వైభవం

13) ధర్మ సందేహములు

14) పరమ శివుని వైభవం

15) తిరుమల వేంకటేశ్వరుని సుప్రభాతం- తాత్పర్యములు

16) పండుగలు వాటి విశిష్టత

17) భక్తి సమాచారం

## రాబోయే రోజుల్లో మేము పోస్టు చేయబోయే పోస్టుల వివరాలు

1) శివ మహా పురాణము

2) జగద్గురు ఆది శంకరచార్య విరచిత సౌందర్య లహరి స్తోత్రములు-తాత్పర్యములు

3) విష్ణు సహస్రనాములో ఉన్న 1000 నామములు వాటి అర్థాలు

4) అరుణాచల వైభవం

5) కాంచీపుర వైభవం

6) గజేంద్ర మోక్షము

7) యక్ష ప్రశ్నలు

8) తిరుప్పావై

10) కార్తీక పురాణం

11) రామాయణంలో దాగి ఉన్న వివిధ సత్యాలు

12) భాగవతంలో నిక్షిప్తమై ఉన్న నీతి కధలు

13) ఇతరములు

# గ్రూప్, ఛానల్ యొక్క వివరాలు

**వాట్సాప్ గ్రూప్ లింక్(1):-**

https://chat.whatsapp.com/E9HdgkdDkxT8JSWoriAAPS

**Facebook official page link:-**

https://www.facebook.com/sanathanahindhusampradayalu/

**Facebook group link:-**

https://www.facebook.com/groups/2364843453567967/?ref=share

పైన తెలిపిన వివిధ రకాల పేజీలు అన్నియు సనాతన హిందూ సాంప్రదాయాలు గ్రూప్ ద్వారా నిర్వహించబడుతున్నాయి. మీకు తెలిసిన వారికి బంధువులకు స్నేహితులకు ఇతరులకు షేర్ చేయగలరు.

ఇట్లు

సనాతన హిందూ సాంప్రదాయాలు ఛానల్

హిందూ సాంప్రదాయాలు ఆచరిద్దాం-పాటిద్దాం

## లోకాసమస్త సుఖినోభవంతు

